చెప్పఁగాఁ దండ్రి "హాకుమారా యేమని పల్కితివి! నీవు వేకువజామున లేచి భగవధ్యానముచేసి పరదూషణసేయుటకంటె నీవును వారివలె నింకను నిద్రించుటయే మేలు. భగవదారాధన చేయకుండుటకంటెఁ బరదూషణయే యొక్కువపాపమునుమా" అని హితోపదేశము చేసెను.

116 వ కథ.

రామతీర్థస్వాములవారిచెంత కొకనాఁడు అమ్మహనీయునిమామ యేడ్చుచు, గుండెలుబాదుకొనుచు నతిదుఃఖముతో వచ్చెను. బ్రహ్మానంద మగ్నుఁడై యున్నయాస్వామి యాతనిదుఃఖమునకుఁ గారణ మడిగెను, అప్పు డాయన "అయ్యో యింకే మున్నది, కొంపకూలినది, వంశమునాశన మైనది నీముద్దులబిడ్డ డాకస్మికముగ మృత్యువువపా లయ్యెను" అని చెప్పి వెక్కి వెక్కి యేడ్చుచుండెను. అప్పు డామహానుభావుఁడు కొంచమైనను చలించక యద్భుతశాంతముతో "అహా యిఁదు దుఃఖించుట కేమికారణ మున్నది! గాలి వీచుచున్నది, నీరు ప్రవహించుచున్నది ,అగ్ని కాల్చుచున్నది, అని చెప్పి యేడ్చువా రుందురా ? పుట్టినవాఁడు చచ్చినాఁ డని చెప్పుటయు నట్టిదే గదా ఇందాశ్చర్య మేమి?" అని పల్కి యూఱడించెను.

117 వ కథ.

ఒకనాఁ డొకస్వామి వీధిలోఁ బోవుచుండఁగా నొకఁ మహాన్మదీయుఁడు చేతిలో నొకసారాయిబుడ్డిఁ బట్టుకొని యదేదారిని బోవుచు నాస్వామిని జూచి "స్వామీ జైలుకు మార్గ మే ద"ని యడిగెను. అంత నాస్వామి వానిచేత నున్నసీసాను జూపి" ఇదే జైలుకు మార్గ" మని చెప్పెను.

118 వ కథ.

పూర్వకాలంబున నొకరాజు గలఁడు. అతఁడు సదా యైహికసుఖములకు లోనై మదోన్మత్తుఁడై యుండెను. ఆరాజు తనవినోదార్థమై కొందఱువేశ్యగాండ్రను తనవద్దనుంచుకొని వారితోఁ గాలము గడువుచుండెను.

వారందఱిలో నగ్రగణ్యుఁ డగునొకనికి బంగారుపతకము నిచ్చి దానిపై, అవివేకదామోదరశిఖామణి, అని చెక్కించెను. ఇట్లుండ నొకనాఁడు రాజున కవసానకాలము సమీపించి, వ్యాధిగ్రస్తుఁడై పరుండి యవివేకదామోదరశిఖామణిని బిల్వ నంపి కన్నీరు గార్చుచు "ఓమిత్రమా నేను బోవుచున్నాను" అనెను. అప్పు డాహాస్యగాడు తడాలున లేచి "స్వామీ గుఱ్ఱపుబగ్గీ కట్టించ మందురా" యని అడిగెను. అంతట రాజు "ఓబుద్ధిహీనుఁడా నేను బోవుస్థలముకుఁ బండ్లమీఁదఁ బో"రని చెప్పెను. తిరిగి వాఁడు "అట్లైన దేవా, యేనుగ దెప్పించ మందురా" యనెను. రాజు వీని యజ్ఞానమునకు విసుకుచెంది "ఛీ మూర్ఖా యచటకు నేనుగపైఁ గూడ బో" రని చెప్పెను. అప్పు డాయవివేకి కొంచెమాలోచించి "ఆహా జ్ఞాపకము వచ్చినది. రాజా, పల్లకీ తెప్పింతునా" యనెను. రాజు వీని మాటలకు మిగుల నచ్చెరువు నొంది "ఓబుద్ధిహీనుఁడా! యచటకు పల్లకిపైఁ గూడఁ బోవుటకు వీలు కా దనెను. ఈమాటల కాదామోదరశిఖామణి విస్మయము చెంది "ఓప్రభువర్యా, మీ కేమి తక్కువ! మీరు నడచిపోవునంతటి గ్రహచారమేమి? అని తిరిగి యడిగెను. రాజు మరణావస్థయం దున్నను వీని తెలివితక్కువకు నవ్వు వచ్చి "ఓ పిచ్చివాఁడా నేను బోవుచోటకు నడచిపోవుటకు సయితము వీలుండ ద"నెను. ఈమాటల కాహాస్యగాడు మఱింతయాశ్చర్యమును జెంది "రాజా మీరు పోవుస్థలము వింతగా నున్నది. మీతో నేను గూడ రావచ్చునా" యనెను. రాజు మిగుల కోపముతో "ఛీ! నోరుమూసుకొనుము. అక్కడకు నెవరికి వారే పోవలెను గాని నీవు నాతో నెట్లు వచ్చెదవురా" అని యడిగెను. అంత నాయవివేకి ఇ దేమిచిత్రము! "రాజా మీరు పోయెడిస్థలము బహువిచిత్రముగా నున్నది! అది దయచేసి యెద్దియో సెలవిండు" అని యడుగ నారాజు కొంచ మాలోచించి నేమియుఁ జెప్పఁ జాలక "నాకుఁ తెలియదు" అని చెప్పెను. ఇట్లు చెప్పినతోడనే నాహాస్యగాడు తనబంగారుపతకమును వూడఁ దీసి "రాజా దీనిని మీరే ధరించుట

కర్హులు. ఇంతరాజ్యమేలుచు, నింద్రాదిభోగముల ననుభవించుచుమీజీవితము లో మీరు తుదకెక్కడకుఁ బోయెదరో దానినిగూర్చి యించుకైనను విచారించ కుండుటకంటె నవివేక ముండునా? కనుక యవివేకదామోదరసిఖామణి యనుబిరుదుకు మీరే తగుదురు గాని నేను గాదని చెప్పి వెడలిపోయెను.

## 119 వ కథ.

ఒకనాఁ డొకబ్రాహ్మణుఁడు బుద్ధభగవానులను జూచి "సోమరివలె నీవు బిచ్చ మెత్తి జీవించెద వేల? ఏదైననొక వృత్తి చేసికొనరాదా యనెను అప్పు డామహానుభావుఁ డిట్లు జవాబు చెప్పెను. "ఓబ్రాహ్మణోత్తమా నేను దున్నితిని విత్తునాటితిని ఇప్పు డది ఫలించినది. దాని ననుభవించుచుంటిని నీవును నావలె దున్ని విత్తు నాటినయెడల నీకును మేరలేనియాహారము దొరకును." అంత నాబ్రాహ్మణుఁడు "నీయెద్దు లేవి, నీనాగలియేది నీ పొల మెక్కడ యేగింజలు నాటితివి?" అని యడిగెను. అప్పు డమ్మహానీయుఁడు "నాహృదయమే పొలము, మనస్సే నాగలి, వివేకమే కొరడా, ఇంద్రియములే యెద్దులు, ప్రేమయే విత్తనము, పట్టుదలయే ఎరువు, భక్తియేవర్షము నిత్యానందమే దీనిఫలము, అది నేను సదా యనుభవించుచుఁ దృప్తుఁడనై యున్నాను. నీవును నావలెఁ గష్టించి సంతృప్తుఁడవు కమ్ము" అని చెప్పెను.

## 120 వ కథ.

పరమభక్తుండును, దేశోద్ధారకుండు నగు మహమ్మద్' ఒకనాఁడు భగవంతునిదర్శనార్థమై స్వర్గమునకుఁ బోయెను, అప్పుడు స్వర్గద్వారము మూసియుండుటచేఁ దలుపు గొట్టెను, అంతట లోపలనుండి యొకశబ్దము "నీ వెవ్వడవు" అని విన వచ్చెను. అంతట నామహానీయుడు "నేను మహమ్మద్" అని యుత్తరవు చెప్పెను. ఇట్లు చెప్పినంతనే పో పొమ్ము. నీవు నిచటకు వచ్చుట కర్హుఁడవు గావు" అని తిరిగి వినఁబడెను, అప్పుడు మహమ్మద్ కొంచె మాలోచించి మఱియొకసారి తలుపు గొట్టెను. అంతట తిరిగి "నీ వెవ్వఁడ వని ధ్వని వచ్చెను. అప్పు డాభక్తుఁడు "దేవా నేను నీదా

తను మానవులకు సన్మార్గమును బోధించి నీనిజభక్తులనుగా జేయుచుంటిని నీపాదారవిందములను దర్శించుటకై వచ్చినాఁడ" నని చెప్పెను. అప్పుడును "నీకు స్వర్గప్రాప్తి యింకను గలుగ లే" దని శబ్దము విన వచ్చెను. మహమ్మదు ఖిన్నుఁడై మఱియొకసారి తలుపు గొట్టెను. తిరిగి యదే విధమున "నీ వెవ్వడవు" అని ధ్వని వచ్చెను. మహమ్మదు "దేవా నీదాసానదాసుండను" అని జవాబు చెప్పెను. తిరిగి "ఛీ పొమ్ము, నీ విచటకు వచ్చుటకు అర్హుఁడవు గావు" అని వినఁబడెను. ఈసారియుఁ దనమనోభీష్టము నెఱవేఱనందునఁ జింతాక్రాంతుఁడై విచారించి విచారించి బాహ్యస్పృహతప్పి యింద్రియచలనము లన్నియు నుడిగి సంకల్పశూన్యుండై సమాధినిష్ఠయందుఁ గొంతదడవు మగ్నుడై యుండి మహదానందమున లేచి తిరిగి యొకసారి తలుపు గొట్టెను. అప్పుడును నదేవిధమున "నీ వెవ్వడవు" అని భగవద్వాక్యమును వినినంతనే "నేను నీవే" అని మహమ్మదు ప్రత్యుత్తర మిచ్చెను. అతక్షణమే స్వర్గద్వారము తెరచుకొనెను.

## 121 వ కథ.

శంకరుఁ డొకనాఁడు తనయిద్దరుకుమారు లగుగణపతిసుబ్రహ్మణ్యేశ్వరులను బిలచి" మీయిద్దఱిలోఁ బ్రపంచమంతయు ముం దెవరు చుట్టివత్తురో వారికి మంచిఫలము నిత్తు నని చెప్పెను. అతక్షణమే సుబ్రహ్మణ్యస్వామి తననెమలివాహనముపై నెక్కి వాయువేగమనోవేగంబులలోఁ బరుగిడుచుఁ బోయెను, గణపతి యూరక తండ్రిచెంతనే కూర్చుండెను. ఇట్లు కొంతకాలము గడచినపిమ్మట సుబ్రహ్మణ్యము భూమిచుట్టును దిరిగి యతివేగంబునఁ దండ్రి చెంతకు వచ్చుచుండుటఁ జూచి గణపతి మెల్లన లేచి తండ్రి చుట్టును దిరిగి "తండ్రీ నేనే గెల్చితిని, ఫల మొసంగు మ"ని యడిగెను. అంత శివుఁడు నవ్వుచు "బాలకా ప్రపంచమంతయుఁ దిరిగి వచ్చినసుబ్రహ్మణ్యమునకుఁ గాక నీ కెట్లు కచ్చు" నని యడిగెను. అప్పుడు గణపతి "దేవా నే నొక్కప్రపంచమునేగాక యన్నిలోకములునయితము మాయన్నకంటె

ముందుగాఁ దిరిగి వచ్చితిని. ఏల యన సమస్తలోకములు నీయందే యున్నవి నీకుఁ బ్రదక్షిణము చేయుట లోకము లెల్లఁ దిరిగినట్లే గదా" యని చెప్ప నా దేవదేవుఁడు మిగులసంతసించి ఫలమును గణపతికే యిచ్చెను.

## 122 వ కథ.

సకలసద్గుణసంపన్నుఁడై తపోనిష్ఠాగరిష్ఠుఁడైన యొకమునిపుంగవుని కొకశిష్యుఁడు గలఁడు. ఆశిష్యుఁ డనుదినము తనగురువునకు మిగులభక్తిశ్రద్ధలతో నుపచారము చేయుచుండెడివాఁడు. ఇట్లుండ నొకనాఁ డొకహఠయోగి యాశిష్యునిఁ జూచి "ఓయీ! నీ వెంతవెట్టివాఁడవు, నీగురువున కేమి తెలియు నని వానినాశ్రయించితివి? వాఁ డెందుకును బనికిరానివట్టిమొద్దు. నావలె వాఁడు నీళ్లపై నడువఁ జాలఁడు. గాలిలో నెగురజాలఁడు. భూమిలో సంవత్సరములకొలఁదిఁ గూర్చుండఁ జాలఁడు. అట్టి తెలివిహీనుఁ డగుపరమ నీచుని నాశ్రయించి నీకాలమంతయు వ్యర్థము చేయుచుంటివి గదా యని పలుక నాతఁడు మిగులశాంతవచనములతో "అయ్యా మీరుచెప్పినమహిమలు వారు చేయకున్నను, నంతకంటె వేయిరెట్లుత్కృష్టమైనమహిమ వారియొద్ద నుండుటచే వారి నాశ్రయించితి" ననెను. ఈమాటల కాయోగి యాశ్చర్యము చెంది "ఆహా యామహిమ యొద్దియో కొంచము నాకుఁ దెల్పు మని కోపమునఁ బల్కెను. శిష్యుఁడు "అయ్యా, గర్వము పరదూషణ క్రోధము మొద లగుదుర్గుణములు వారియొద్ద వెదకినను గాన్పించవు. ఇంతకన్న నెక్కువమహిమ కలదా? యని చెప్ప నాయోగి తనదుర్గుణంబులకు సిగ్గుపడి యూరకుండెను.

## 123 వ కథ.

ఒకజ్ఞాని బజారునఁ బోవుచుండఁగాఁ బురజనులు వానిని జూడవచ్చిరి కొంద రాయనకుఁ బట్టువస్త్రములఁ గప్పిరి. కొంద రాభరణములచే నలంకరించిరి. కొందఱు పూలహారముల వేయుచుండిరి. ఇ దంతయు నాతఁడు చూచి "ఓహో నిత్యకల్యాణస్వరూపుఁ డగుభగవంతునిచేతుల కాభరణము

లేల, కాళ్లకు నగ లేల, యాదివ్యమంగళస్వరూపుని దేహమునకుఁ బట్టువస్త్రము లేల యని నవ్వుచుఁ బల్కెను. ఈవృత్తాంతమంతయు రాజునకుఁ దెలిసి “ఔరా, యీకపటసాధువు తాను భగవంతునిగా భావించుచున్నాఁడుగా! ఇట్టిఘోరపాతకునిశిరము నాయెదుటనే ఖండించుఁ డని యాజ్ఞాపించెను. తక్షణమే యాజ్ఞానిని బంధించి రాజుసాన్నిధ్యమున నిలువఁ బెట్టి, తలారి ఖడ్గము పైకెత్తి తల నరుకఁ బోవుసమయమున నాసాధువు ‘అగు, అగు, రాజా మిమ్ము కొన్నిప్రశ్నల నడిగెద వాటికి ప్రత్యుత్తర మిచ్చి పిమ్మట మీపని కానిం” డని చెప్పెను. రా జందుల కంగీకరించెను. అప్పుడు సాధువు “రాజా! యీప్రపంచ మెవ్వరిది?” అని యడిగెను.

రాజు:— భగవంతునిది.

సాధు:— ఈసూర్యచంద్రాదు లెవ్వరివి?

రాజు:— భగవంతునివి.

సాధు:— ఈయనంతకోటిజీవరాసు లెవ్వరివి?

రాజు:— భగవంతునివే.

సాధు:— ఈశరీరము లెవరివి?

రాజు:— భగవంతునివే. యందుకుసందేహ మేమి?

సాధు:— ఈచేతులు, కాళ్లు, మొండ మైన యంగము లెవరివి?

రాజు:— ఇవియును భగవంతునివే

యనెను. అంత సాధువు రాజా నే నీమాటలు చెప్పినందుకే గదా నాకు మరణదండన విధించిరి! ఇప్పుడు మీరు చెప్పినమాటలనే నే నంటిని గాని భగవంతుని నింద చేయలేదే! యనెను. రాజు తనయవివేకమునకు సిగ్గుపడి యాభక్తునిపాదములపైఁ బడి క్షమాపణ వేఁడెను.

## 124 వ కథ.

ఒకనాఁడు రామతీర్థస్వాములవారిపరిచారకుఁ డగునొకబాలుఁడు మేడపై నెక్కి “నేనే పరమాత్మను, అంతా నేనే.” యని సంతో

షమున నరచుచుండెను. ఈమాటలు వినినయొక పెద్దమనిషి వానిమాటలకు నవ్వి «ఓరీ బాలకా నీవే పరమాత్మ వైనయెడల నక్కడనుంచి క్రిందకు దుముకుము చూచెద ననెను. ఆబాలుఁడు కొంచ మైనను తడుముకొనక «ఓహో బ్రహ్మాండ మంతయు నేనే నిండియున్నాను. నేను లేని స్థలముచూపించినచో నచట దుమికెదను'' అని చెప్పెను. అంత నాతఁడుపరమాత్మ లేనితావు నెచ్చటను నిర్దేశించలేక సిగ్గుఁ జెంది వెడలిపోయెను.

## 12వ కథ.

ఇద్దరుమనుజులు కలిసి యొకయూరికిఁ బోవుచుండిరి అం దొకఁడు దైవభక్తుఁడు, రెండవవాఁడు నాస్తికుఁడు. వారిమార్గమధ్యమున నొకదేవాలయము తటస్థించెను. అప్పుడు భక్తుఁడు లోపలకుఁ బోయి భగవంతుని ఇంచుక ప్రార్థించి తిరిగి వచ్చుచుండఁగా వానికాలిలో ముల్లు గుచ్చుకొనుటచే కుంటుచు వచ్చెను. బయటనే కూర్చున్ననాస్తికునికి నొకవరహా దొరికెను. అప్పుడు నాస్తికుఁడు భక్తునిఁ జూచి «ఓయిబుద్ధిహీనుఁడా, చూచితివా? దేవుఁ డఁట! దయ్య మఁట! నీభక్తికిఁ గలిగినఫలము కాలులో ముల్లు, నాభక్తిహీనతకుఁ గలిగినఫలము వరహా. నిజముగ భగవంతుఁడే యున్న నిట్టియన్యాయ ముండదు గదా? ఇక నైనను నీపిచ్చిభ్రాంతి విడచి నావలె నుండుము'' అని చెప్ప నాభక్తునికిఁ గొంచము మనసు కలవరపడి యనుమానించుచుండగా నొకజ్ఞాని యటుబోవుచు వారింజూచి జరిగినవృత్తాంతమంతయుఁ దెలిసికొని యాభక్తునిఁ జూచి «ఓయీ, నీవు పూర్వజన్మంబున నొక గొప్పనేరము చేసితివి. దానికిఁ బ్రతిఫల మిప్పుడు నీవు పాముచేఁ గరవఁ బడి చావవలసి యుండెను. కాని యీజన్మమందు నీకుఁ గలిగిన దైవభక్తి యడ్డమువచ్చి నీశిక్ష తేలిక యయ్యెను. పిమ్మట నాస్తికునిఁ జూచి «ఓయీ నీవు క్రిందటిజన్మమున నొకగొప్పసత్కార్యము చేసితివి అందులకు ఫలముగా నీ కిప్పుడు ధనరాసి ప్రాప్తముగా వలసియుండ నీభక్తివిహీనత దానికి నడ్డము వచ్చి నీఫల మతిస్వల్ప మయ్యెను.'' అని చెప్ప భక్తునికి ననుమానము దీరి భక్తివృద్ధినొందెను. నాస్తికునికి భక్తిబీజములు నాటెను.

## 126 వ కథ.

ఒకపరమహంస సమాధినిష్ఠుఁడై యుండ నమ్మహాత్మునిస్థితి నెఱుంగని యొకగృహస్థుఁ డాతనిం జూచి “యోగివరా! మీ రేల సకాలంబున సంధ్యా వందనముచేయరు?” అని యడుగ నాతఁడు “ఓగృహస్థుఁడా, అజ్ఞాన మనెడి తల్లిచచ్చినది; సుజ్ఞాన మనెడిపుత్రుఁడు పుట్టినాఁడు. ఇట్లు సూతకము, పురుడు రెండు నొకటేసారి సంభవించి యుండగా సంధ్యావందనము చేయు ట కెట్లఁగును? అని యుత్తర మిచ్చెను.

## 127 వ కథ.

ఒకానొకస్థలమందుఁ బ్రతిదినమును వేదాంతులుగూడి పరమార్థమును గూర్చి చర్చించుచుండెడివారలు. ఇట్లుండ నొకనాఁ డాగ్రామమున కొక మహనీయుఁడు వచ్చె ననుసంగతి దెలిసి యీవేదాంతు లందఱును వారిని దర్శించుటకై పోవ యత్నించుచుండఁగా నచటఁ బంజరములో నున్నచిలుక చక్కఁగా మాటలాడుట నేర్చిన దగుటచే నొక వేదాంతిని బిలచి యయ్యా మీ రమ్మహనీయునిఁ జూచినప్పుడు నాకీబంధమునుండి విముక్తి యె ట్లగునో తెలుసుకొని ర మ్మని వేఁడుకొనెను. అట్లే యావేదాంతి యామహాపురు షునిచెంతకుఁ బోయెను. అప్పు డాయన నదిలో స్నానము చేయుచుండఁగా “స్వామీ పంజరములో నున్నచిలుకకు బంధవిముక్తి యె ట్లగు” నని యడి గెను. ఆమహానుభావునిచెవికి నామాటలు సోకినంతనే తిరిగి మాటాడక గభాలున నీట మునిఁగి శవమువలె బ్రవాహములోఁ గొట్టుకొని పోయెను. ఈయుపద్రవమున కావేదాంతి యాశ్చర్యపడెను. మిగిలినవా రంద ఱామ హానుభావునిమరణమున కీవేదాంతియే కారణ మని వానిని దిట్ట సాగిరి. పాప మావేదాంతి ఖిన్నుఁడై యింటికిఁ బోయెను. ఇల్లు చేరినంతనే చిలుక “అయ్యా నాప్రశ్న కేమి జవాబు చెప్పినా ర”ని యడిగెను. అప్పు డాతఁ డు “అయ్యో! యే మని తెల్పుదును నీపాడుప్రశ్న యడిగినంతనే యామ హనీయుఁడుమృతి నొందెను.” అని యిట్లు పలికినతోడనే చిలుక గిరగిరఁ

దిరిగి నిస్పృహుడై క్రిందఁ బడెను. ఈయద్భుతమును జూచినవా రందఱు మిగుల నాశ్చర్యమును జెంది యేమియుఁ దోచక చచ్చినచిలుకను బంజరము నుంచి తీసి యావల విసరిపారవేసిరి. అట్లు పాఱవేసినంతనే చిలుక బఱ్ఱున యెగిరి యొకవృక్షాగ్రమునఁ గూర్చుండి "ఓమతిహీనులారా! మీరిన్నిదినముల నుండి వేదాంతశ్రవణముఁ జేయుచున్నను, బంధవిముక్తికి మార్గమును గ్రహింపఁ జాలకైరి. ఆమహనీయుఁడు చచ్చె నని మీరు తలఁచుచున్నారు. అయ్యో మీ రెంతవెఱ్ఱివారలు! నాప్రశ్నకు వారు చెప్పినయుత్తరము వారు నాచరించియే చూపిరి. మీ రెన్నిదినములు వేదాంతశ్రవణము చేసినను, యెందఱి మహనీయుల దర్శించినను, నెన్నిదేవతలకు మ్రొక్కినను బ్రతికి యుండియు నెవఁడు ప్రపంచమునకుఁ జచ్చునో వాఁడే జరామరణము లనెడి బంధములనుండి తప్పించుకొని యానందముతో నిప్పుడు నావలె స్వేచ్ఛను గాంతు రని హితోపదేశము చేసి యాకాశముపై నెగిరి పోయెను,

## 128 వ కథ.

ఒకసాధువు సర్పముచేఁ గఱవఁబడి మరణావస్థయం దుండఁగా నాతని శిష్యులు "గురువరా! అయ్యో, యీపాడుపాము మీకు మృత్యువయ్యె గదా! మీయోగబలముచే దానివిషమును హరింపఁ జేయ రాదా" యని యడిగిరి. అందుల కాభక్తుఁడు "శిష్యులారా, జగన్మాత, నన్ను దక్షిణమే యామె సాన్నిధ్యమునకు ర మ్మని సర్పముచే వార్తఁ బంపి యున్నది. మాతల్లియాజ్ఞను నే నుల్లంఘించను" అని చెప్పి యానందమునఁ గండ్లు మూసుకొని ప్రాణములు విడచెను.

## 129 వ కథ.

ఒకానొకమనుజుండును వానిభార్యయు విరాగులై యరణ్యమునకుఁ బోవుచుండిరి. ఇట్లు పోవుచుండఁగాఁ ద్రోవలో నొకనవరత్నఖచిత మగు నాభరణము భర్తకుఁ గాన్పించెను. వెంటనే యాతఁడు దానిం జూచి "ఆహా! యిది నాభార్యకంటఁ బడినయెడల దీనిపై నాశ గలుగ వచ్చు నని

దానిపైఁ గాలితో మట్టి వేసెను. ఇదంతయుఁ జూచుచున్నయాతనిభార్య "ఆహా! మీ రేమి చేయుచున్నారు, చెప్పు" మని బ్రతిమాలుకొనెను. అంత నాతఁడు దాచుటకు వీలు లేక తాను జేసినకార్యమును చెప్పెను. అప్పు డామె నవ్వుచు "ఆహా మీరు తిరిగి యింటికిఁ బోవచ్చును, మీ కింకను వైరాగ్యము కలుగలేదు. నిజమైనవిరాగికి మన్నును బంగారము నొకటిగానే గోచరించును. ఇట్టి భేదబుద్ధి మీకుఁ బోకమునుపే సంసారము నేల త్యజించితిరి" యని చెప్పినంతనే నాతఁ డామెవైరాగ్యమునకును, బుద్ధికుశలతకును మిగుల సంతసించెను.

## 130 వ కథ.

కర్ణునితో సమానమైనదాత లేఁడని ప్రపంచ మంతయుఁ బొగడుచుండ దుర్యోధనుఁడు సహింపఁ జాలక యాతనికన్న నెక్కువపేరు సంపాదించవలె నని, కర్ణునివలె దానును దానకంకణము గట్టుకొనెను. సర్వజ్ఞుఁడగుశ్రీకృష్ణభగవానులు దుర్యోధనుని బరీక్షింపఁ దలఁచి యొకబ్రాహ్మణవేషము దాల్చి వానిచెంతకుఁ బోయి దాన మడిగెను. అప్పు డా రాజు "ఓభూసురోత్తమా మీకు ద్రవ్యముగాని, యిండ్లుగాని, భూములుగాని యేమి కావలె నన్నను నిచ్చుటకు సిద్ధుఁడనై యున్నాను. మీ కేమి కావలయునో సెలవొసంగుఁడు" అని వినయవిధేయములతో నడుగ నాబ్రాహ్మణవేషధారి "రాజా నా కివేమియు నవసరము లేదు. నే నొకక్రతువును జేయ సంకల్పించినాను. ఆనాఁటికి నాకుఁ గావలసిన కట్టెపుల్లలుమాత్రము దయచేసినచో నదే మహాభాగ్య" మని విన్నవించినంతనే దుర్యోధనుఁడు "ఓహో, యెంతస్వల్పకోరిక గోరితివి! అట్లే కానిమ్ము" అని చెప్ప యాబ్రాహ్మణుఁడు వెడలిపోయెను. పిమ్మట సర్వశక్తుం డగుశ్రీకృష్ణుఁడు పదిహేనుదినము లహోరాత్రములు కుంభవర్షము గురిపించి యెచ్చటను నొక్కయెండుపుల్లయైన లేనట్లు చేసి దుర్యోధనునికడకుఁ దిరిగి బ్రాహ్మణవేషముతో బోయి "ఓమహారాజా, నేనడిగినకట్టెపుల్లలు దయచేయుఁ" డని యడిగెను.

అప్పుడు దుర్యోధనుఁడు విస్మయముఁ జెంది «ఓబ్రాహ్మణోత్తమా, గడచిన గొప్పవర్షములచే నెచ్చటను యెండుకట్టెయే లేదు. మీకుఁ గావలె నన్న నెంతధనమైన నిచ్చెదను. లేక కొన్నిరోజులు మీక్రతువును నిలిపినచోఁ బిమ్మట మీ కెంతకలపనైన నిచ్చెదను'' అని చెప్పినంతనే యాబ్రాహ్మణుఁడు «ఓహో రాజా నీ వేమో మహాదాత వని విని నీచెంతకు వచ్చితిని. నీమాటలు నమ్మి క్రతువుచేయుట కిప్పుడు సమకూర్చుకొంటిని. కట్టెపుల్లలే యివ్వజాలక నాక్రతువుగూడ నిలుపుకొమ్మని సలహాయిచ్చుచుంటివి. చాలు చాలు నీచేత కానిచోఁ గర్ణునిచెంతకే పోయెదను'' అని చెప్పి తిఱిగి పోయి కర్ణునియొద్ద కేగెను. కర్ణుడు వీనికోరికవిని కొంచమాలోచించి సేవకులను బిలచి తనదివ్య భవనమును కొంతనూడఁదీయించి యందలి విలువగలకలపనంతయు నాబ్రాహ్మణుని కిచ్చి పంపెను. ఆబ్రాహ్మణుఁ డాకలపనంతయుఁ బండ్లపై నెక్కించి దుర్యోధనుని యింటిముందరగాఁ బోవుచుండ దుర్యోధనుఁ డాశ్చర్యము చెంది ఆహా, నిజముగఁ గర్ణునకే దాతశబ్దము చెల్లును గాని నావంటివానికిఁ గాదు'' అని సిగ్గుఁ దెచ్చుకొని తాను గట్టుకొనినదానకంకణమును దీసివేసెను.

## 131 వ కథ.

ఒకగ్రామములో నొకబీదవాఁడు కలఁడు. వాఁ డొకచిన్నగుడిసె లోఁ దనయాలుబిడ్డలను దనకష్టార్జితమువల్లఁ బోషించుచు సుఖంబునఁ గాలముఁ గడుపుచుండెను. అగుడిసెకు సమీపముననే మిక్కిలిసౌందర్య మైన యొకభవనమును నిర్మించి యందుఁ గాపురము చేయుచున్న యొకధనికుఁడు కలడు. ఆధనికున కొకప్పుడును మనశ్శాంతి లేకఁ యెద్దియో యొకకలవరము గలిగి సంతోష మన నెట్టిదో నెఱుగనివాఁడై యుండెను. ఇట్లుండ నాగ్రామమున కొకసన్యాసి వచ్చెను. అప్పు డాధనికుడు ఆయనను దర్శించి «స్వామీ, భగవంతుడు నాకన్నివిధముల పూర్ణమైనయైశ్వర్య మిచ్చినను ఆదరిద్రున కున్నమనస్థిమిత మే నాకు లేదు. వాని ముఖమం దెప్పుడును సం

తోషము తాండవమాడుచుండును, ఇందుకుఁ గారణ మేమని యడిగెను, అప్పుడా సన్యాసి ‘‘ఓయీ నీమనశ్శాంతినిభంగము చేయుచున్నది నీధనమే’ యనెను. అంత నాధనికుఁడు ఆశ్చర్యముఁ జెంది ‘అహా. ప్రపంచములోని సమస్తసౌఖ్యములు ధనముచేతనే లభించుచుండగా నాసౌఖ్యభంగమునకు ధన మెట్లుకారణ మగును? ఇది వింతగా నున్నది. నాసందేహము దీర్చు’’ డని యాసన్యాసిని యడిగెను అంతట వా రిద్దరునుయా పేదవానిగుడిసెకు బోయి వానికి దెలియకుండ నొకగుడ్డకు 99 రూపాయలను గట్టి గుడిసెలో బడవేసిరి. ఆమరునాడు తిరిగి వారిద్దరును యాగుడిసెకుఁ బోయి వానిని జూచిరి, అబీదవాని ముఖము వాడిపోయి సంతోషహీనమై విచారగ్రస్తమై యుండెను. అందులకు కారణమేమని సన్యాసి వాని నడుగ వాడు అయ్యా నాకు నిన్నటిదినమున ఒకసంచి దొరకినది. అందు 99 రూపాయలు మాత్రమే యున్నవి, నూటికి ఒక్కటితక్కువగా యుండుటచే దానిని గూడ పూర్తి జేయ వలె నని మే మందరము నిన్నటినుండి పస్తుంటిమి ఈకారణముచే నాముఖము వాడి యున్నది. మఱియు ఈరూపాయలను ఎక్కడైన దాచినచో దొంగ లపహరింతురే మో ననియు యెవరికయిన అప్పిచ్చినచో తిరిగి యివ్వరేమో నని జిజ్ఞాసయు నాపిల్లలు యీధనమంతయు త్రమకే యివ్వ మని బాధించుటచే దుఃఖమును పొంది యున్నా నని చెప్ప యాధనికుని సందేహము తీరెను.

## 132 వ కథ.

జర్మన్ దేశస్థుడును తత్వవేత్తలలో నగ్రగణ్యుండు నగు ‘‘క్యాంటు,, అను నాత డొకదినమున నాత్మవిచారణయందు మగ్నుడై మార్గమున బోవుచుండఁ తనచేతికఱ్ఱ యొకపెద్దమనిషికి తగిలెను. అంత నాతడు‘‘క్యాంటు,, ను జూచి కోపముతో‘‘ఓయీ నీ వెవరవు?,, అని ప్రశ్నించెను. అంత క్యాంటు చిరునవ్వుతో నీవు న న్నడిగిన ప్రశ్నకు నీవే సదుత్తరము చెప్ప గలిగినయెడల నీ భూమండల మంతయూ నే నెట్లయిన నార్జించి నీకు బహుమాన మొసంగెదను. అని చెప్పెను.

## 133 వ కథ.

ఒకపిల్లవాడు మరియొకపిల్లవానితో “నీవు దేవు డున్నస్థలము చూపించినయెడల నీ కొకపండు నిచ్చెద” నని చెప్పెను. రెండవపిల్లవాడు “నీవు దేవుడు లేనిస్థలము చూపించినచో నీకు రెండుపండ్లు నిత్తు న”ని జవాబు చెప్పెను.

## 134 వ కథ.

పూర్వకాలమున ఒకమనుష్యుడు మఱియొకనికి కొంతభూమి నమ్మెను అతడు దానిని త్రవ్వుచుండగా ధనముతో నిండినరెండుబంగారుకలశములు దొరికెను. వెంటనే వాడు యాకలశములను దీసుకొని తనకు భూమి నమ్మినవానియొద్దకు వెళ్ళి “అయ్యా మీరు నా కమ్మినభూమిలో యీద్రవ్యము దొరికినది. ఇది మీదే గనుక దీనిం దీసుకొం” డని చెప్పెను. అంత నామనషి “అయ్యా నాభూమిని మీ కమ్మినపుడే అం దుండెడిధనముసహా మీదే గాని నా దెట్లగును? గనుక దానిని మీరే దీసుకొం డని తిరిగి యిచ్చివేసెను. గాని యాతడు “ఓహో యి దెక్కడియన్యాయము మీరు నాకు భూమినే అమ్మితిరిగాని అం దుండెడి ధనము నమ్మలేదు గదా. ఇట్టి పాపకృత్యమునకు నేనొడిగట్టుకొనను” అనిదానిని తిరిగివానికేయిచ్చెను ఇట్లీయిరువురు వివాదములాడుచు ధర్మరాజుచెంతకు బోయి చెప్పుకొనెను. ఆరాజు యిద్దరిని తృప్తిచేయ జాలక సర్వజ్ఞు డగుశ్రీకృష్ణునిసాన్నిధ్యమునకు బంపెను. అంత నామహానుభావుడు వీరిద్దరివివాదమును విని “మీ కొకసంవత్సరము గడువు బెట్టితి. అంతవఱకు నీరెండుకలశములను చెరియొకటి భద్రముగా గాపాడి సంవత్సరాంతముకు తిరిగి నాయొద్దకు వచ్చినచో మీకు న్యాయము చెప్పెద నని చెప్పి పంపివేసెను. ఇదంతయు జూచుచున్నధర్మరాజు ఆశ్చర్యము జెంది “కృష్ణా నీవు మహానుభావుడ వని వారిని నీయొద్దకు బంపితిని. వారికి హిత మగు తీర్పును చెప్పి యిద్దరిని సంతోషపరచక యీస్వల్పకార్యమునకు సంవత్సరము గడువు బెట్టితివి. ఇంతమా

త్రము నేను చేయ లేక పోతినా" యనిపరిహసించెను. అంత శ్రీకృష్ణుడు
చిరునగవుతో "ధర్మరాజా నేను వారివివాదము పరిష్కరించితిని. వారు
నురల మనవద్దకు రారు" అని చెప్ప నారాజున కేమియు నర్థముగాక దానిని
వివరించి చెప్పుమనెను. అప్పుడు కృష్ణుడు "రాజా ఆబంగారుకలశముల
నిద్దరికి చెరియొకటి నిచ్చి భద్రముగా నొకసంవత్సరము కాపాడు డని చెప్పి
యుంటిని. ఇట్లొకసంవత్సరము ఆధనమును తమయొద్దనే యుంచుకొను
టచే కొంతకాలమునకుసాంగత్యదోషము వాటిల్లి వారిద్దరికిని దానియందు
ఆశగలిగి దక్కినదే చాలు నని సంతోషించి న్యాయస్థానమునకు బోయిన
అదికూడ బోవునేమో యని భీతిచే యూరక యుందురు" అని చెప్ప
ధర్మరాజు శ్రీకృష్ణునియపారజ్ఞానమున కచ్చెరవు నొందెను.

135 వ కథ.

ఇగ్లాండుదేశమునందున్యూటన్, అనుతత్వవేత్త తనస్నేహితు నొకని
భోజనమునకు బిలచి, ఆసంగతి తనయింటనుండువారికి చెప్పుట గూడ మరచి
తత్వవిచారణయందు మగ్నుడై యుండెను. పిమ్మట వానిస్నేహితుడు వచ్చి
యాతత్వవేత్తకు భంగము కలుగునేమో యని పిలువకనే అతనివద్ద బల్లపై
నమర్చి యున్నయాహారమును భుజించి వెళ్ళిపోయెను. పిమ్మట కొంతసేపటి
కాతత్వవేత్త స్పృహకు వచ్చి బల్లమీదనున్నయుత్తపళ్లెమును గిన్నెను, పండ్ల
తోళ్లను జూచి, అహా నేను భుజించినసంగతియే నాకు తెలియ లేదు!
ఈదృష్టాంతములిక్కడ లేకున్నచో నేనింకను భోజనము జేయలే దనే యూ
హింతుగదా, యని కడుపునిండినవానివలెనే సంతసించితిరిగి ధ్యానమగ్నుడై
యుండెను.

136 వ కథ.

ఒకరాజుభార్య చాలదైవభక్తిగలిగి సకల సద్గుణసంపన్నురాలై
యుండెను. ఒక్కసారియైన నోట "రామా" యని యుచ్చరించనియా
మెభర్తను ఎటులైన భక్తిమంతునిగా జేయ వలె నని యెన్నివిధముల బోధిం

చినను నిష్ఫలమై మిగుల చింతించుచుండెను, ఇట్లుండ నొకనాడు రాజు నిద్రబోవుచు 'రామా' యని నెమ్మదిగ కలువరించెను. అప్పుడాసాధ్వీమణి మహదానందంబునొంది ఆహా నేటికిగదా నేను ధన్యురాల నైతిని అని మిగులసంతసించి మరునాడు ఆపట్టణమంతయు నలంకరింప జేసి పేదలకు అన్నవస్త్రములనిచ్చి విశేషధనమును దానము జేసి గడువైభవముల జరుపుచుండగా రాజు యిందులకుఁ గారణము దెలియక భార్యకృత్యముల కాశ్చర్యమొంది యామెను దానికి గారణము జెప్పు మని యడిగెను. అంత నాపతివ్రతాతిలకము "నాథా, యిన్నిదినములకు మీనోట భగవన్నామమును విన గల్గితిని ఇంతకన్న నాకు బరమానంద మే మున్నది, ఇదెయే కారణ" మని చెప్పెను. ఇది వినినంతనే రాజు విస్మయము జెంది "నే నేమని బల్కితి! యెప్పుడు బల్కితి!" నని యడిగెను, అంత నామె "నాథా మీరు నిద్రించుచు, రామా యని కలువరించితిరి" అని యనినంతనే రాజు "అయ్యో యెన్నిసంవత్సరములనుండియో మిగుల భద్రముగ నాహృదకమలయమునందు దాచుకొనిననామూలధనము వెల్లడి యయ్యె గదా యని ప్రాణములు విడిచెను.

## 137 వ కథ.

కొన్నిసంవత్సరములకిందటనే గుంటూరుపురమున కొకదిగంబరిగానున్నయోగిని యెచ్చటనుండియోవచ్చి బజారున బోవుచుండగా ఒకరాచకీయయుద్యోగస్తుడు చూచి యామెను కారాగృహమున బెట్టించెను. అప్పుడమ్మహనీయురాలిని దర్శించుటకై వెళ్ళినయొకరు "అమ్మా మీ రేల బట్టకట్టరు? అని ప్రశ్నించెను. అందు కామె నేను బుట్టినపుడే చర్మవస్త్రమును ధరించి వచ్చితి. దీనిపైమరియొకవస్త్ర మేల?" నని చెప్పెను. అంత వారు తిరిగి "అమ్మా మీ రిట్లుండ దలచినచో నడవులలో నుండవలెను గాని పట్టణములకు రా కూడదు" అని చెప్ప నాదిగంబరి "నే నిప్పుడు ఘోరారణ్యమం దున్నాను. మీరు చెప్పినయడవులలోనుండు

యడవిమృగములు నన్నేమియు బాధించక నాతో మైత్రిగలిగియుండెను. గాని యీప్రదేశమున నన్ను గారాగృహమున బంధించి విచ్చుకత్తులతో పహరానిచ్చుచున్నారు. నేనొకరినిపలుకరించ లేదు. ఒకరిని యాచించలేదు నాతోనను నేను బోవుచుంటిని, యిట్టినిరపరాధులను బాధించునీప్రదేశము ఘోరారణ్యముకంటె యెక్కుడయేగదా? యని జవాబు చెప్పెను.

## 138 వ కథ

ఒకనాడు రామతీర్థస్వామి అమెరికాదేశమునందుపన్యసించుచు రాచకీయవిషయములనుగూర్చి అధికముగ ప్రసంగించెను. ఆసభయందు న్యాయాధికారులును, న్యాయవాదులును, యింక గొప్పగొప్పనుద్యోగములలోనుండు అనేకులును గలరు. ఉపన్యాసాంతరమందు న్యాయాధికారులు స్వాములవారిచెంతకు వచ్చి "స్వామీ, మీ రిట్టివిషయములను యిక ముందెన్నడును ప్రసంగించవలదు. ఏల యన నీదేశచట్టముల ప్రకారము మిమ్ము చెరసాలయందుంచుటయో, లేక నురిదీయుటయో సంభవించును. ఇది మీ యొక్క శ్రేయస్సును గోరి బల్కుచున్నార" మని హితవు జెప్పిరి. అంత రామతీర్థులవారు "ఓదయానిధులారా, ఈదేహ మేమైనను సరే సత్యమునే ప్రకటించెదను. ఇప్పటివరకు నన్ను(ఆత్మను)ఛేదించగల్గిన ఖడ్గము చేయబడలేదు, వేయేల యింతకైనను నాకు హానిచేయగలుగు ఆయుధ మింకను పోతబోయ బడలేదు. నాకు పుట్టుకలేదు. చావు లేదు. భూతభవిష్యద్వర్తమానములం దొక్కరీతిని యున్నవాడను. నాకు భయ మేల" యని ప్రత్యుత్తర మిచ్చెను. అంత వారు స్వాములవారిధైర్యసాహసములను స్వార్థపరిత్యాగము గొనియాడుచు మరలి పోయిరి.

## 139 వ కథ.

### రాధాకృష్ణసంవాదము.

రా:—కృష్ణా, నీఅసత్యములకు మేర లేదు. ఆహా! ఇట్టి యసత్యప్రపంచము నొకదానిని గల్పించి మనుష్యులనెంతమాయబుచ్చుచున్నావు!

కృ:—నిజమే నేను అసత్యవంతుడనే యనుకొనుము. గాని నాఅసత్యమును అసత్యముగా నెవరు దెలుసుకొందురో వారి కీఅసత్యప్రపంచమంతయు మాయమై సత్యస్వరూపుడ నగునే నొక్కడనే గాన్పింతును సుమా!

రా:—అది యటుండ నిమ్ము నీవు మోసగాడ వనినైయైన నొప్పుకొనెదవా లేదా? నీవును నేనును నిజమున నొక్కటే యైనను నీకును నాకును భేదముగల్పించితివి గదా? ఇక నీవు మోసగాడ వని యనుటకు సందేహ మున్నదా?

కృ:—నిజమే నేను మోసగాడనే యనుకొనుము. గాని యెవరు తానును నేనును వేరని భావించునో యట్టివారికి మాత్రమే నేను వేరుగా గాన్పింతును గాని తానును నేనును ఒక్కటే యని భావించు వారికి యొక్కటిగానే యుందును. ఇందు నాతప్పేమి?

రా:—నిజమే, నీయం దేతప్పు నులేదు. గాని దొంగతనముమాత్రము పూర్తిగా గాన్పించుచున్నది. నీవంటిదొంగయే లేడు. మనుష్య లజ్ఞాననేత్రమునందు మాయ యనుమందు జల్లి వారియానంద మనుద్ర వ్యము నపహరించి వారినిగ ఃఖములపాలు జేయుచుంటివి? ఇంతకన్న దొంగతన మేమి? ఇది యైన నొప్పుకొనెదవా?

కృ:—సత్యము బల్కితివి. నేను దొంగనే యనుచున్నావు గాని వేదములు నన్ను "తస్కరాణాంపతిః" యని దొంగలరాజుగానహితము వర్ణించుచున్నవి. గాని నేను చేయుదొంగతనము అందరివలెనే గాదు ఎవరు అజ్ఞాన మనెడినిదురలోబడి తా మెవ్వరైనది మరచి నిద్రించు చుందురో అట్టి వారిని మేల్కొలు పుట కెంతయో ప్రయత్నింతును అప్పటికి ని వారులే వనియెడల వారిధనమును అపహరించుచుందును ఇందుమాత్రము నాతప్పేమి?

రా:—కృష్ణా, నీ కేమి మాటలురాని వాడవా? అన్నిటికి నన్నిసమాధాన ములు చెప్పుచున్నావు కాని నీవు మిక్కిలిక్రూరుడవు సుమా! నిన్ను దయాస్వరూపుడని యెట్లు బలికెదరో తెలియదు! పిల్లికి చెలగాటము

యెలుకకు ప్రాణసంకటము అనునట్లు నీలీలయంతయు హింసామయము గదా! అహా! నీవెంతటికఠినాత్ముడవు!

కృ:—రాధా, నిజముగ నేను కఠినాత్ముడనో లేక దయాస్వరూపుడనో యోచించి చెప్పుము! అందరియందును ఆత్మస్వరూపముగ నున్ననన్ను కొంచమైన హింస యని తలంపక లోతుగ బూడ్చి మట్టి గప్పి నన్ను దలువ నైన దలప కున్నారు. వా రంతకఠిను లైనను నేనుమాత్రము యెవరిని విడనాడక యెవరికి గా వలసినది వారి కిచ్చుచు తుదకు నాయందు లీనము చేసుకొనుచున్నాను.

రా:—కృష్ణా, నీయుక్తుల కేమి గాని, నీయంతవ్యభిచారి లేడు గదా! నీప్రియురాండ్రసంఖ్యకు మిత మున్నదా? ఇదియైన వొప్పుకొనెదవా?

కృ:—రాధా, నాయం దెన్నిదోసము లెంచుచుంటివి! నీ వారోపించినయానిందయు సత్యమే. ప్రతిజీవాత్మయు నాప్రియురాలే. నాప్రియురాండ్రతో అనేకవిధముల సరససల్లాపములాడుచుందును. కొన్నిసమయములు నేను మరుగుగాను, కొన్నిసమయములు నేను వేరుగను కొన్ని సమయములు ఒకటిగాను యిట్లనేకవిధముల లీలావినోదములు సల్పి తుదకు నేనును నాప్రియురాండ్రును యెప్పటికిని భేదభావములేక నొక్కటిగానే యుందుము.

రా:—కృష్ణా, జగన్నాటకసూత్రధారుండ వగునీకు సమాధానము చెప్పలేను గాని మఱియొక్కసందేహముమాత్రము దీర్పుము. నీవు పక్షపాతివిగా నాకు గాన్పించుచున్నావు. ఇదియైనను సత్యమేనా?

కృ:—రాధా, నేను పక్షపాతకుడ నని తలచువారికి నటులనే గాన్పింతును గాని నేనుమాత్రము పిపీలికాదిబ్రహ్మపర్యంతము గలఅనంతజీవకోటిని ఒకేవిధమున కాపాడుచు రక్షించుచున్నానునుమా, నాయం దెప్పటికితప్పు లేదు

రా:—కృష్ణా, అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుం డగునీయట్టిమహామహుని కృత్యములు అవాఙ్మానసగోచరంబు గదా!నీదాసానదాసులపాటరేణు

వునకైనను బోల్ప దగనినావంటియసమర్థురాలు ని న్నెంచుటకంటె మౌనము ధరించి మునులవలె గూర్చుండుటయే మేలు'' అని చెప్పి యూరకుండెను.

140 వ కథ.

హెర్బర్టుస్పెన్సరు, అనునొకఇంగ్లాండు దేశస్థు డుండెను. అతను మహాజ్ఞానసంపన్నుడును, సకలవేదాంతరహస్యతత్వవేదియు నై యుండెను. ఒకనా డొకవిద్వాంసుడు ఆయనతో॥ అయ్యా మీజ్ఞానవికాసము అపార పారావారముగా నున్నది. మీకింతజ్ఞానసంపత్తి గలుగుట కెన్నిగ్రంథములు జదివితిరో! యని ఆశ్చర్యమున బలికెను. అంత నాతత్వవేత్త నవ్వుచు॥ నేవి నేవగ్రంథములను జదివినచో జ్ఞానహీనుడనుగానే యుందును. సృష్టి యనె డిబ్రహ్మాండగ్రంథమును నే సదా పారాయణచేయుచుండుటచే నాకీజ్ఞానవి కాస మయ్యె,, నని జవాబు చెప్పెను.

141 వ కథ.

మిక్కిలిధనవంతుడును పరమలోభియు నగునొకమనుష్యుడు తనద్రవ్య మునంతయు రాసులురాసులుగా పెట్లలో బెట్టి భూమిలో బూడ్చుచుం డెను. ఇ దంతయు జూచుచున్నొకసన్యాసి అందుకు గారణ మడిగెను. అప్పు డాధనికుడు॥ ఎప్పు డెట్టియవసరమువచ్చునో నెవరికి దెలియును? ముం దెప్పుడైన మిక్కిలియవసరము గలిగినప్పుడు ఉపయోగపడుటకై ధనము దాచుచున్నానని చెప్పెను. అంత నాసన్యాసి మారు బలుకక వెడలిపోయి మరు నాడాధనికుని తనమఠమునకు వచ్చునట్లు జేసెను.అప్పు డాసన్యాసి మిక్కి లిప్రయాసతో పెద్దపెద్దరాళ్లను దెచ్చి యొకపెద్దగోతిలో వేసి బూడ్చుచుం డుట జూచి ఆశ్చర్యము జెంది॥ స్వామీ, మీ రేల యిట్టివిపరీతపుగార్యము జేయుచుంటిరి'' అని యడిగెను. అంత నాసన్యాసి, నా కెప్పుడెట్టియవసరము వచ్చునో, ఏమఠమును గట్టించ వలెనో నెవరికి దెలియును! ఎప్పు డేప్రళయ

మైనను, మరేయుపద్రవమైనను వచ్చి యీకొండలన్నియు గొట్టుకపోవు నేమో నని రాళ్లను భద్రముగా దాచుచుంటి నని చెప్పెను. అంత సాధనికుడు పకపక నవ్వుచు, ఆహా యేమివిపరీతము బల్కుచుంటిరి! ఈకొండలన్నియు గొట్టుకొనిపోయి రాళ్ల కెన్నడైన కరువు వచ్చునా? ఇంతకన్న యవివేక ముండునా యనెను. అంత సన్యాసి॥ సకలలోకాధీశుండును పరమపితయు, జగజ్జనకుండు నగుపరమేశ్వరుడు చీమమొదలు బ్రహ్మపర్యంతము పోషించి రక్షించుచుండగానీబ్రతుకొరకు ధనము బూడ్చిబెట్టుట కంటె నవివేకముగలదా?॥ అని బుద్ధిచెప్పెను.

## 142 వ కథ.

చక్రవర్తికుమారుం డగుబుద్ధుడు విరాగియై కాయవస్త్రములు ధరించి చేత నొకభిక్షాపాత్రము బూని దిరుగుచుండగా, చక్రవర్తి చూచి మిగులచింతాక్రాంతుడై॥ అయ్యో కుమారా భూమండలమంతయు బాలించుమహారాజుముద్దులపుత్రుడవై యుండియు భిక్షుకునివలె సన్యాసివేషమును దాల్చి మనవంశమునకంతకును అపకీర్తి దెచ్చుచుంటివి గదా! నేను గాని నాతండ్రి గాని, నాతాతముత్తాతలు గాని యెవరైన నిట్లు దరిద్రునివలె వీధులలో బిచ్చమెత్తిరా? మనవంశీకులందరును అనేకతరములనుండియు చక్రవర్తులుగానే యున్నారుగాని నీవలె సన్యాసిగా నొక్కరును లేరు. ఈవేసము దీసి మనమర్యాదగాపాడుము॥ అని చెప్పెను. మహానుభావుం డగుబుద్ధభగవానులుచిరునగవుతో॥ రాజేంద్రా, అట్లుకాదు నీవంశీకులందరును చక్రవర్తులే గాని నావంశీకులందరునుఅనేకతరములనుండియు సన్యాసులుగానే నాదివ్యదృష్టికి గోచరించుచున్నది. నీవును నేనును జీవయాత్రలో వేరువేరు మార్గముల బోవుచు అనేకులగర్భమునబుట్టుచు జచ్చుచు యీజన్మమున ఇక్కడ గలసితిమి. తిరిగి నీదారిని నీవును, నాదారిని నేనును బోవలసినవారలమే గాని వేరుకాదు'' అని ప్రత్యుత్తర మిచ్చెను.

## 143 వ కథ.

ధృవుడను రాజకొమారుడు తనతండ్రికంటె నధికరాజ్యమును సంపాదించవలెనని ఘోరారణ్యములకేగి యేకాంతమున నిశ్చలమనస్కుండై యనేక సంవత్సరములు తపమాచరించుచుండెను. ఇట్లుండ గొంతకాలమునకు గామితార్థప్రదాయకుండగు భగవంతుడు ప్రత్యక్షమై "ఓకుమారా, నీభక్తికి సంతసించితి. నీకేమికావలయునో కోరుము" అని పలుక నాభక్తాగ్రేసరుఁడు "హేదేవా, నాకేకోరికయులేదు. నేను వాంఛాశూన్యుండను" అని చెప్ప భగవంతుడు "యేమీ, నీకోరికయే నీవుమరచితివా, నీజనకుని కన్నను మిన్నయగు రాజ్యాధిపత్యము గోరిగదా నీవు తపమాచరించుచుంటివి! కాన నేకచక్రాధిపుఁడవై ప్రపంచమంతయుఁ బాలించుము" అనిపలుక నాబాలుడు "ఓసచ్చిదానందమూర్తీ, గాజుముక్కకై వెదకుచుండ దివ్యమాణిక్యము దొరికినట్లును, జలబిందువకై వెదకుచుండ అమృతకలశము దొరికినట్లును, రాజ్యాధిపత్యమునకై వెదకుచుండ నఖండసచ్చిదానందమూర్తివగు నీదర్శనము లభించినది. దేవా, నాకేల! పూర్ణసంతుష్టుడనైతి సర్వవాంఛాశూన్యుడనైతి. ఆనందభరితుడనైతి" నని ప్రత్యుత్తరమిచ్చెను.

## 144 వ కథ.

ఒకజ్ఞానిచెంతకుఁ భార్య మిగుల దుఃఖించుచుఁ బోయి "అయ్యో మనయేకపుత్రుఁడు జచ్చెను" అని యేడువసాగెను. అంతఁ జ్ఞానికండ్ల నుండి కన్నీరు కాల్వలైపారెను. అప్పుడు దగ్గరనున్న శిష్యుడు తనగురువు దుఃఖించుట జూచి గురువుకంటె నెక్కువగా నేడ్చెను అంతటఁ గురువు శిష్యునిఁ జూచి "శిష్యరత్నమా, నీవెందుకు దుఃఖించుచున్నా" వని యడిగెను. శిష్యుడు "గురువరా, తామెందుకు ఏడ్చుచుంటిరో మొదట సెలవిండు" అని చెప్పఁ గురువు "ఓరీ, నాపుత్రుడు చచ్చెనని నేనేడ్చుచున్నట్లు నీవు భావించితివేమో అట్లుకాదు, చావులేనివాఁడు జచ్చెనని దుఃఖించుఁ వారల యజ్ఞానమును జూచి నయ్యో నేనింతకాలము బోధించిన

దంతయు నిష్ప్రయోజన మయ్యెగదా యని దుఃఖించితిని గాని మఱియొకటి కాదు, యిక నీవేడ్చుట కేమికారణమో చెప్పుము'' అని పలుకఁ శిష్యుడు ''దేవా మీవంటి జ్ఞానసంపన్నుల కింకను నేను నాది యను అహంకార మమకారము లించుకయుండి యిప్పుడు దుఃఖమునకు గారణమయ్యెగదా యని దుఃఖించితి ననెను. అప్పుడు గురువు తనశిష్యుడు తనకన్న మించినవాడయ్యె నని సంతసించెను.

## 145 వ కథ.

ఒకరాజు తనమంత్రికిఁ లక్షరూపాయల నిచ్చి సన్యాసులకుఁ బంచి పెట్టుమని యాజ్ఞాపించెను, బుద్ధిశాలియగు నామంత్రి సరే యని పోయి మరునాడు తిరిగి యాధనరాసినంతయు రాజుయెదుట బెట్టి ''రాజేంద్రా నాకెవ్వరును సన్యాసులు గన్పించలే'' దనెను రాజు ఆశ్చర్యమున ''యేమి సన్యాసులే గనుపించలేదా! మనపురమందు వేలకొలది సన్యాసులుండ నొక్కడైన గాన్పించలేదని బలుకుట కడువింతగా నున్న'' దనెను అప్పు డామంత్రి ''దేవా నిజమైన సన్యాసి ధనముఁ స్వీకరించడు. ధనముఁ స్వీకరించువాడు సన్యాసికాడు, గాన మీరిచ్చిన ధనము నెట్లువినియోగ పరచవలసినదీ నాకుఁ దెలియక తిరిగి తెచ్చితి ననెను, రాజు మంత్రియొక్క బుద్ధికుశలతకుఁ సంతసించెను.

## 146 వ కథ.

ఒకానొకరాజు గలడు, ఆరాజు తనయాస్థానపండితున కీమూడు ప్రశ్నల నిచ్చెను

1. దేవుడెక్కడ గూర్చుండును?
2. దేవుఁ డేదిక్కు జూచుచుండును?
3. దేవు డేమిచేయుచుండును?

ఈప్రశ్నలకుసదుత్తరము లివ్వని శిరచ్ఛేదనము జేయింతునని యాజ్ఞాపించెను. అంత నాపండితుడు మిగుల భయముగలవాడై 10 దిన

ములుసావకాశ మడిగి యింటికి బోయి యేమియుదోచక మంచమెక్కెను. ఇట్లుండ జ్ఞానసంపన్నుఁ డగునాపండితునిసేవకుడు తనయజమానుని దుఃఖము నకు గారణము దెలుసుకొని పండితుని యూరడించి రాజుచెంతకుఁ దానుబో యెను. చింకిగుడ్డలు కట్టుకొని కడుమూఢునివలెనున్న యాసేవకుని జూచిరాజు ఆశ్చర్యము జెంది నీవెందుకు వచ్చితివనెను. సేవకుడు ఓభూపాలగ్రణి, మీరు మాయజమానునికిచ్చిన ప్రశ్నల కుత్తరముఁ జెప్పుటకు వచ్చితిని. మాయజ మానుడు జబ్బుగానున్నందున నన్నుఁబంపించెను. ఇది మీకిష్టమేనా యనెను. రాజు "ఓహో యెవరైననేమి. కాని నీవు చెప్పలేనిచో ప్రాణములు గోల్పో వుటకు సిద్ధముగానుంటివా యనెను. అంత సేవకుడు సిద్ధమేగాని నేనొక్కటి మిమ్ములఁ గోరనున్నాను. బోధకు డున్నతస్థానమందును, బోధింపబడువాడు క్రిందను గూర్చుండుట శాస్త్రధర్మము. అది మీకు సమ్మతమైన నేను చెప్పినంతవరకుఁ మీసింహాసనము నాకిచ్చిమీరు క్రిందఁగూర్చుండవలె ననెను. రాజు అందు కంగీకరించి యాసేవకునిఁ సింహాసనముపైఁ నెక్కించి తాను క్రిందఁ గూర్చుండెను. అప్పుడు సేవకుడు కొన్నిపాలుఁ దెప్పించి "రాజా యిందు వెన్నయున్నదా లేదా? చెప్పవలెననెను. రాజు "ఉన్నదనెను. సేవకుడు ఎచటనున్నదో చెప్పవలెననెను. రాజు కొంచమాలోచించి అం తటా యున్నదనెను. సేవకుడు, భగవంతుడును అదేవిధమున నంతట నున్నా డని చెప్పెను. పిమ్మటఁ ఒకదీపము వెలిగించి "రాజా యీదీపము యేవైపు ప్రకాశించుచున్న దనెను. రాజుఅన్నివైపులుఁ బ్రకాశించుచున్న దనెను. అప్పుడు సేవకుఁడు భగవంతుడును ఇట్లే చూచుచున్నాడనిచెప్పెను. పిమ్మట దేవు డేమిచేయుచుండు ననెడు మూడవప్రశ్నకు నిట్లుఁ జెప్పెను "రాజా యిప్పుడు నేనెచట నున్నాను? రాజు సింహాసనముపై నున్నావు అనెను. సేవకుడు రాజా నీ వెచటనున్నావు? అనెను రాజు నేను క్రింద నున్నా ననెను. అంతఁ సేవకుడు రాజా భగవంతుడు రాజునిఁ సేవకుని గను, సేవకుని రాజునిగను, ధనవంతుని దరిద్రునిగను, దరిద్రుని ధనవంతునిగను,

కీర్తివంతుని, కీర్తిహీనునిగను, కీర్తిహీనుని కీర్తివంతునిగను, ఇట్లే యొప్పుడును మార్పులనుఁ జేయుచుండునని చెప్పెను. అంత రాజు మిగులఁ సంతోసించి వానికిఁ దగుబహుమానమిచ్చి పంపెను.

## 147 వ కథ.

పరీక్షిన్మహారాజుకు శ్రీశుకులవారు ఏడుదినములలోఁ దత్వోపదేశముఁ జేసిముక్తుని జేసెననెడి భాగవతకథను ఒకరాజు విని తనపురోహితునిఁ బిలిపించి తననుకూడా ఏడుదినములలో ముక్తునిఁ జేయుమని యాజ్ఞాపించెను. అటులఁ జేయకుండిన యెడల శిరచ్ఛేదనఁ చేయింతునని భయపెట్టెను. పురోహితుడు మిగులఁ భయముజెందినవాడై అనుదినముఁ దనశక్తివంతయు నుపయోగించి బోధించుచుండెనుగాని రాజున కిందుకయును జ్ఞానోదయము కలుగలేదు. పురోహితుడు మిగులఁ దిగులొంది ఏడవదినమునఁ దనజీవితము నేటితోఁ సరిగదాయని కడుదుఃఖముగలవాడై భార్యాబిడ్డలను జూచి యేడవసాగెను. అప్పుడు మిక్కిలిజ్ఞానసంపన్నురాలగు నాతనికుమార్తె తాను రాజును సమాధానపరతునని తండ్రికి ధైర్యముచెప్పి రాజుచెంత కిద్దరును బోయిరి పిమ్మట రాజును దర్శించి "రాజా మీరు మాతండ్రికిచ్చిన యాజ్ఞ యేమని యడిగెను, రాజు "శుకులవారు పరీక్షిత్తుకు ఏడుదినములలో బంధవిముక్తునిజేసి ముక్తిసామ్రాజ్య మొందజేసెను. నాకును అట్లే చేయమని ఆజ్ఞాపించితి నని చెప్పెను. అంత నాసాధ్వీమణి రాజా నేను చెప్పినట్లు మీరు చేసినయెడల మీకు దగుసమాధానము గలుగు ననిచెప్ప రా జందుల కంగీకరించెను. పిమ్మట నాయువతి నొకకత్తిని నొకపెద్దత్రాడును దెప్పించి నాత్రాటిచే తనతండ్రిని యొకస్తంభమునకు చేతులు కాళ్లు ఘట్టిగ బిగించి కట్టెను. తరువాత అదేవిధమునఁ రాజును మరియొకస్తంభమునకుఁ గట్టెను.పిమ్మట నాకత్తెను తండ్రిచేతి కిచ్చి రాజుత్రాళ్లనుఁ గోయు మనిచెప్పెను, అంత నాతడు అయ్యో, యీవిధమున నేను బంధింపబడియుండ రాజు త్రాళ్లను గోయుటెట్లు? అనిచెప్ప నాయువతిలకము ఆకత్తిని రాజుచేతులోనుంచి

రాజా మాతండ్రిని విడిపించ మని చెప్పెను. అంతట రాజు ఆశ్చర్యముతో ఓహో నేనే బంధింపబడియుండ మీతండ్రిని విడిపించుటెట్లు? అనియడుగఁ నా జ్ఞానసంపన్నురాలు॥ రాజేంద్రా బంధరహితుండగు శ్రీశుకులు పరీక్షిత్తునకు బంధవిముక్తుని జేయగలిగెను గాని సంసారపాశములచేఁ బంధింపఁబడిన మాతండ్రి మిమ్ము బంధములనుండి యెట్లువిముక్తునిఁ జేయగల్గును? అని హితోపదేశమఁ జేసి రాజును సంతృప్తిపరచి తండ్రిని మరణమునుండి తప్పించెను.

## 148 వ కథ.

లోకవిఖ్యాతుండును తపస్సంపన్నుండు నగు జనక చక్రవర్తి శాస్త్రవిచారణఁ జేయుచుండగా «మోక్షము ఒకక్షణములోనే లభింపగల ద''ని ఒకగ్రంథమునందు గాంచి తనయాస్థానమందుండు పండితులను, శాస్త్రవేత్తలను యీవచనము విశ్వసింపదగినదేనా యని ప్రశ్నించ వారందరు ఏకగ్రీవమున అందులకేమియు సందేహము లేదనిబల్కిరి. అంత నారాజు తన కట్లె మోక్షము క్షణములోఁ లభించునట్లు జేయుడని ప్రార్థించ మేమట్లు చేయ జాలమని ప్రత్యుత్తరమిచ్చిరి. అందులకుఁ రాజు ఆగ్రహచిత్తుడై వారందరినిఁ గారాగృహమునఁ బడవేసెను. పిమ్మట గనబడిన విరాగులను, సన్యాసులను, బోధకులను రావించి యిట్లే ప్రశ్నించుచు వారును యిట్లేచెప్పటచే నందరినిఁ గారాగృహమున బంధించుచుండెను. ఇట్లుండ నొకనాడు ఆత్మవిజ్ఞానపూర్ణుఁడు ను, మునిశ్రేష్ఠుండును నగు అష్టావక్రుని రాజుచెంతకుఁ భటులుబట్టితెచ్చిరి. అంత రాజుపూర్వమువలెనే ప్రశ్నింప నాముని క్షణములో ముక్తునిఁ జేయుట కంగీకరించి రాజును యొక ఘోరారణ్యమునకుఁ దీసుకొనిపోయెను అచట రాజును నిలుచుండుట కాజ్ఞాపించి నీవు గురుదక్షిణ యిచ్చుటకు సిద్ధముగ నుంటివాయని యడుగఁ నందులకుఁ రాజు «ఓహో! మీరింతటి మహోన్నత పదవినే దయచేయుచుండఁ గురుదక్షిణ కేమితక్కువ! మీరు కోరినదంతయు నిచ్చుటకు సిద్ధుడనై యున్నా''నని చెప్పెను, అంత

నా తాపసేంద్రుడు "రాజా నీమనస్సును నాకు దక్షిణగా నొసంగుమని యడిగెను. రాజు అందుల కంగీకరించి మనోశూన్యుండై యుండెను. అంతనిశ్చలుండై నిర్వికల్పసమాధియందు మగ్నుడై అఖండసచ్చిదానందపరబ్రహ్మను పొందెను.

## 149 వ కథ.

ఒకరాజు అనిత్యములగు విషయసుఖములను రోసి విరాగియై తనయథార్థస్థితిని దెలుసుకొనగోరి యొకమునిసత్తము నాశ్రయించి వానివలన సమస్తశాస్త్రములను దెలుసుకొనుచుండెను. ఇట్లు 12 సంవత్సరములు విద్యనభ్యసించి సమస్తవేదాంతరహస్యములు దెలిసికొని పూర్ణుండనైతి నని దలంచి గురువుకు నమస్కరించి సెలవడిగెను. అప్పుడా తాపసి "శిష్యా నీ కిప్పటికి అక్షరాభ్యాసమైనదని తలంచుము. నీవు నేర్చుకొనవలసినదంతయు ముందున్నదని చెప్ప వారాజు ఆశ్చర్యముం జెంది మరి 12 సంవత్సరములు అచటనే యుండి సమస్తయోగములు అభ్యసించి అణిమాద్యష్టసిద్ధులను సయితము సాధించి పరిపూర్ణుడనైతి నిగదా యని సంతసించి తిరిగి గురువుకు నమస్కరించి సెలవడిగెను. అప్పుడా ఋషిసత్తముడు చిరునగవుతో "శిష్యరత్నమా నీ వింకను విద్యాపూర్ణుడవు గాలేదు. మరికొన్నిదినము లుండుమని చెప్పినంతనే రాజు మునుపటికంటె నాశ్చర్యము జెంది మరి 12 సంవత్సరములు తత్వవిచారణయందును స్వస్వరూపానుసంధానమందును వినియోగించి తననిజస్థితిని దెలుసుకొని బ్రహ్మానందమగ్నుడై లేచి గురువుకు నమస్కరించకనే వెళ్లుచుండెను. అప్పుడా ఋషిపుంగవుడు వానిం జూచి "శిష్యరత్నమా నీవు నా సెలవు గైకొనక నాకు నమస్కరించకనే బోవుచుంటివి ఇది న్యాయమేనా? యనెను. అంత నాశిష్యుండు ఈయనంతకోటిరూపములును నారూపములేయైయుండ నేనెవరికి నమస్కరింతును? అని చెప్ప నాతాపసేంద్రుడు నీ విప్పుడుగదా పూర్ణుండవైతి వని చెప్పి మిగుల సంతసించెను.

## 150 వ కథ.

శంకరులవారు గంగానదిలోఁ స్నానముఁజేసి తనయాశ్రమమునకుఁ వచ్చుచుండగాఁ ద్రోవలోఁ బ్రహ్మజ్ఞాని యగునొకమాలవా డెదురుగవచ్చెను, అప్పుడు శంకరులు “ఓరీ చండాలా యెంత నిర్భయముగ దగ్గరకుఁ వచ్చితివి! ఛీ, దూరముపొమ్ము”. అని పలికెను. అప్పు డాబ్రహ్మవేత్త చిరునగవుతో “ఓసాధుపుంగవా, నీవు దూరముగా తొలగుమనునది ఈస్థూలశరీరమునా, సూక్ష్మశరీరమునా, లేక ఆత్మనా? స్థూలశరీరము నైనచో నీశరీరమును నాశరీరమును గూడ పంచభూతాత్మికములేగదా! సూక్ష్మశరీరము నైనచో మనోమయ మైనది గనుక నీదెంత నిష్కళంక మైనదో నాదియు నంతనిష్కళంక మైనదే సుమా! ఆత్మనైనచో నది సర్వవ్యాపియై యచంచలమై యున్నది. గావునఁ నింక దేనిని తొలగుమంటివో చెప్పుమన శంకరులు యాతడు బ్రహ్మవేత్తయని గ్రహించి “బ్రహ్మజ్ఞానియగువాడు బ్రాహ్మణు డైనను చండాలు డైనను నాగురువుగా భావింతు ననిచెప్పి యాతనికి సాష్టాంగదండప్రణామ మాచరించి వెడలిపోయెను.

## 151 వ కథ.

నాస్తికుడగు ఒకానొక గొప్పశాస్త్రజ్ఞుడు, తత్వవేత్తయు బ్రహ్మజ్ఞానియు నగు సోక్రటీసుతో నీవు దేవుడు దేవుడన్నవా డెక్కడనున్నాడో యని భూమండలమంతయు వెదకితిని సూర్యమండలము చంద్రమండలము నక్షత్రమండలమంతయు మిక్కిలి శ్రేష్టతరమగు దుర్భిణియంత్రములతో బాగ జూచితివి గాని యెక్కడను గన్పించలే దనెను. అంతఁ సోక్రటీసు “నీవు, మరియొకయంత్రముతో జూచుట మరచితివి సుమా! అనిచెప్ప నాశాస్త్రజ్ఞుడు ఆయంత్రమేమని యడిగెను: అంతట తత్వవేత్త భక్తి, విచారణ వైరాగ్యము యనెడి యద్దములను మనస్సనెడి యంత్రముకు నమర్చి జూచిన యెడల భగవంతుడు తప్పక గోచరించును అనిచెప్ప నాశాస్త్రజ్ఞుడు వానికి శిష్యుడై భగవంతుని యథార్థస్థితిని దెలుసుకొని నిర్మలానందమున నుండెను.

## 152 వ కథ.

ఒకానొక బ్రహ్మజ్ఞాని, సర్వదా ప్రాపంచికసుఖములయందే కాలము గడుపుచున్న నొక రాజుపట్టణమునకుఁ వచ్చెను. రాజు ఆమహాపురుషునికీర్తి విని వానిం జూడదలంచి తనయాస్థానమునకుఁ రావించి తనప్రక్కనే కూర్చుండ నియమించెను. గాని యాతపోధనుడు రాజువంక నైన జూడక వానితో నొక్క మాటయైన ముచ్చటించక యచటనున్న సేవకులతో ముచ్చటించుచుండెను. రాజాతనివిపరీతకృత్యమునకును తనకుఁ జేసిన యవమానమునకును కోపోద్దీపితుడై యాబ్రహ్మవేత్తకు శిరచ్ఛేదనజేయుమని యాజ్ఞాపించెను. అప్పుడామహనీయుడు "రాజా నీతో ముచ్చటించక, నిన్ను గౌరవించక నీసేవకుల తోడనే కాలముగడిపినందున నాకు శిరచ్ఛేదన విధించితివిగదా! రాజులకెల్లను రాజైన భగవంతుని స్వప్నమునందైననుఁ దలంచకఁ దుచ్ఛములగు నిహలోక సుఖములయందే కాలముబుచ్చుచున్న నీకు సర్వేశ్వరు డెట్టిశిక్షను విధించునో తెలియకుంటివిగదా? యనెను. అంత నారాజు తనయవివేకమును దెలిసుకొని పశ్చాత్తాపమునొంది నాబ్రహ్మవేత్తపాదములపైఁ బడి యాతని యనుగ్రహమునుఁ బొంది సన్మార్గుడయ్యెను.

## 153 వ కథ.

ఒకగ్రామమునం దొకసన్యాసి మఠముకట్టించుకొని అందు నివసించుచుండెను. ఆయనకుఁ బ్రతిదినమును అక్కడకుఁ సమీపముననున్న యొక పల్లెటూరునుంచి యొకగొల్లది భక్తిశ్రద్ధలతోఁ పాలుఁ దెచ్చి యిచ్చుచుండెను. ఇట్లుండఁ నొకనాడాగొల్లది వేళతప్పి వచ్చుటచేఁ నేడింత యాలస్యముగ నేలవచ్చితి వని సన్యాసి యడిగెను. అప్పుడామె "స్వామీ యేటు దాటించువా డాలస్యముగఁ వచ్చుటచేఁ వాడు వచ్చువరకుఁ గాచుకొని యుంటి''నని చెప్పెను. అప్పుడాసన్యాసి 'ఓహో యేరు దాటుటకు ఒకరు దాటించవలయునా? రామనామము నుచ్ఛరించి దాటలేకుంటివా?'' యని పరిహాసమునఁ బల్కెను. మరునాడు ఆగొల్లది ప్రతిదినముకంటె

ముందుగాఁ వచ్చి సన్యాసికి నమస్కరించి «తండ్రీ, మీరు నాకుఁ మిక్కిలి యుపకారముఁ జేసినారు. ఇక నెన్నటికిని యేరుదాటుటకు డబ్బు ఖర్చు లేకనే యుండెడి యుపాయమును నేర్పితిరి.'' అనిచెప్ప నాసన్యాసి ఆశ్చర్యమున «ఆహా, నే నేమియుపాయముఁ జెప్పితి'' ననెను అంత నాగొల్లది స్వామీ, మీ రప్పుడే మరచితిరా! నిన్ననేగదా మీరు పరమపావనమగు రామమంత్రప్రభావమునుఁ జెప్పితిరి! నే నామంత్రోచ్చారణఁజేసి నిమిషమాత్రంబున యేరుదాటితి నని చెప్పఁ నాసన్యాసి మరింత నాశ్చర్యముజెంది «ఆహా, యేమి దీనివాక్యములు! దీనిని బరీక్షింపవలె ననిగొల్లదానిని ముందు నడువమని తాను వెనుకఁ రామనామము నుచ్చరించుచు నదిలోఁ దిగెను గాని పాపము మునుగుచుండెనేగాని తేలడయ్యె. అంతనాగొల్లదానితోఁ అయ్యో ఇదేటియాశ్చర్యము, నీవు నీటిపైఁ స్వేచ్ఛగాఁ బోవుచుంటివి గానినేను మునుఁగుచుంటిని! అని బలుకఁ నాగొల్లది తిరిగిజూచి «ఓహో స్వామీ మీమంత్రముపై మీకే నమ్మకము లేదే! నమ్మకమే యున్నయెడలఁ మీరు యేటిలోఁ దిగునప్పుడు బట్టలు తడుచునేమో నని పైకి బిగబట్టుదురా?'', అని చెప్పనాసన్యాసి సిగ్గుపడి తన కింకనుఁ పూర్ణమైన భక్తివిశ్వాసములుఁ గలుగలేదని చింతించి తిరిగి బోయెను.

## 154 వ కథ.

దేశదేశములుఁ దిరుగుచుఁ మహోపన్యాసములుఁ గావించుచున్న యొక సంఘసంస్కర్త ఒకనా నొకయవధూతనుఁ జూచి «స్వామీ నేనెన్ని యుపన్యాసములు జేసినను సమస్తశాస్త్రములలో నుండెడి నాపాండిత్యమంతయు విరజల్లినను నామత మవలంబించువారు మిక్కిలిస్వల్పము మీరు ఉన్నతావునుండి కదలకున్నను సదా మౌనమునే ధరించియున్నను మీశిష్యులసంఖ్యకు మేరలేదు. ఇందుకుఁ గారణమే''మని యడిగెను. అందుల కాయవధూత «దీపము పురుగులను తనచెంతకుఁ రమ్మని పిలువకున్నను వేనవేలు దానిచుట్టునుఁ జేరి అందు దుముకుచుండును. పుష్పములు తమయం దుండెడిమకరందమును పానముజేయుమని నాహ్వానము జేయకున్నను తుమ్మెదలు తమంతట దామేపోయి దానినిద్రావి యానందించును. ఆదేవిధమున నీయందుగల బరమాత్మను బ్రకాశింపజేసినయెడల నీవు బిలువకున్నను మనుష్యులందరు నీచుట్టును జేరి నీకు దాసత్వము జేయుచుందురు. మనుష్యులేగాక పంచభూతములు సహితము నీయాజ్ఞకుఁ లోబడియుండును సుమా!'' అని జవాబుచెప్పెను.



# జ్ఞానోదయ డైరీ.

---

ఇది అన్ని డైరీలవలెగాక యిహపరముల రెంటికిని నుపయుక్తమైనది. ఇందు నీప్రపంచమున నవతరించిన మహాత్ముల జ్ఞానవాక్యములను, నీతిబోధయు సులభమైన తెనుగుభాషలో యెల్లరకు తెలియునటుల అనేకగ్రంథములను పరిశోధించి ప్రతిపేజియందును కొంతభాగము వ్రాయబడి మిగిలినభాగములో దినచర్య వ్రాసుకొనుటకు వీలుకలుగజేయబడినది. దీనిని జదివినప్రతివారికిని అన్యమత ద్వేషముబోయి పరస్పరానురాగము తప్పకగలుగును. మరియు నిందు సద్గుణాభ్యాసమును దుర్గుణ విసర్జనయు గలుగుటకు సులభసాధ్యమగు నూతనపద్ధతులు జూపబడియున్నవి. సుజనులారా! సర్వోత్కృష్టమైన మానవజన్మంబెత్తినందుకు సదా యైహికవిషయములలోనే దగులుకొనక పరచింత గలిగి ముక్తినొందుటకు ప్రతివారును బ్రయత్నించవలెను. ఈపుస్తకము మోక్షాపేక్షితులకు మిగులసహకారి. బ్రతివారిహస్తంబున నుండతగినది వెల 0—6—9 అణాలు.

శ్రీరంగావధూత భక్తజనసమాజ కార్యదర్శి,

ఆత్మూరి రామమోహనరాయ్.

వలయువారు:—

ఆత్మూరి జగన్మోహనరాయ్.

మచిలీబందరు. (Masulipatam.) అని వ్రాయవలెను.

# ప్రకటన.

వైదికసభా ప్రాసనాధిపతి వారగు బ్రహ్మశ్రీ అత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులు బి. యే., బి. యెల్. వారిచే ప్రచురింపబడిన వేదగ్రంథములు

1. తైత్తిరీయ బ్రాహ్మణము, స్వరసహితము ఆంధ్ర లిపిని మంత్రబ్రాహ్మణభాగ విభజనతో ముద్రింపబడినది. రు. 3—0—0

2. కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహిత (స్వరసహితము) 7 కాండలుగలది. వేదాంగశిక్షాసహితము. 3—0—0

3. వైశ్యధర్మప్రకాశిక (రెండవకూర్పు) 1—4—0

4. కృష్ణయజుర్వేద తైత్తిరీయ మంత్రార్థము స్వరసహితము ప్రాజాపత్యాధ్వరయాజమానములు 380 పేజీలుగలది. 1—0—0

5. సూక్తార్థప్రకాశిక (స్వరార్థసహితము) శ్రీసూక్తము మొదలు 8 సూక్తములుగలది. 1—0—0

6. నమకము ఉత్తరభాగము. 5, 6, 7, 8, 9. 10, 11, అనువాకములు స్వరార్థసహితము. 1—0—0

7. కృష్ణయజుర్వేద తైత్తిరీయసంహిత, వేదాంగ స్వరశిక్షా సహితము. 5, 6, 7, కాండలు. 1—0—0

8. పురుషసూక్తము. స్వరార్థసహితము. (రెండవకూర్పు) 0—8—0

9. స్మార్తకర్మలు ప్రథమభాగం. భాష్యము, తెలుగు అర్థ క్రియా సహితము. 0—8—0

10. ఋగ్వేద ఐతరేయబ్రాహ్మణము. 0—6—0

11. సంస్కృతభాష్యసహిత తైత్తిరీయ సంహిత ప్రథమానువాకము నాగర లిపి ఇంగ్లీషుతర్జుమాతో కూడా. 0—8—0

12. ఆశీర్వచన మంత్రములు, జట, పదము, క్రమము, ఘన, స్వరసహితము. 0—8—0

13. చమకము. స్వరార్థసహితము. 0—6—0

14. కాండానుక్రమణిక. 0—4—0

15. శ్రీముఖావళి. 0 4 0

16, గోత్రప్రవరకాండ. వైశ్యధర్మప్రకాశికలో నొక భాగము. 0 4 0

17. విజయనగరం మహారాజావారి వద్ద ఇచ్చిన వేదలెక్చరు (ఇంగ్లీషు) 0 4 0

18. భగవద్గీత రెండుఅధ్యాయములకు ఇంగ్లీషుతో గూడార్థము 0 4 0

19. మంత్రపుష్పము, గాయత్రి, స్వరార్థసహితము (మూడవకూర్పు) 0 2 0

20. ఆర్యలఘు సంధ్యావందనము. స్వరార్థసహితము నాలుగవకూర్పు. 0 2 0

21. శ్రీసూక్తముస్వరార్థసహితము (రెండవకూర్పు) 0 2 0

22. వైశ్యశాంకరీఖండనము. (రెండవకూర్పు) 0 2 0

23. విచ్ఛిన్నోపాసనము, స్వరార్థసహితము. 0 2 0

34. పుణ్యాహవచనము, స్వరార్థసహితము, 0 2 0

25. పరాశరస్మృత్యుక్తవైశ్య ధర్మసంగ్రహము. స్వరార్థ 0 2 0
సహితము. 0 2 0

26. శ్రీశృంగేరి స్వాములవారికిని, శ్రీఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులవారికిని జరిగిన ప్రశ్నోత్తరములు. 0 2 0

27. వేదవిషయమై యిచ్చిన ఇంగ్లీషులెక్చరు. 0 2 0

28. విఘ్నేశ్వర విష్వక్సేన పూజలు స్వరార్థసహితము (రెండవకూర్పు) 0 1 0

29. యజ్ఞోపవీతధారణ విసర్జనమంత్రములు. 0 1 0

30. పరిషేచన మంత్రములు. 0 1 0

31. అమావాస్య తర్పణము. 0 1 0

32. పశువధఖండన (ఇంగ్లీషు) 0 1 0

33. రెండు ఆశీర్వచనమంత్రములు, స్వరసహితము. 0 0 6

1. విజ్ఞానామృతము: సర్వసంగ పరిత్యాగినియు అవధూతాశ్రమవాసినియునగు శ్రీజ్ఞానమాంబగారిచే తన 12 వ యేటనే ప్రకటింపఁబడిన భక్తిజ్ఞానవైరాగ్యములను బోధించు పద్యగ్రంథము. రు 0 1 0

2. శ్రీరంగావధూతలవారిజ్ఞానబోధావళి: అవాఙ్మానస గోచరంబగు వాయుపా[illegible]వారలో[illegible]హంబునుండిమితబుద్ధిచేగ్రహింపగలిగినటో

న్నికీర్తనలు, పద్యములు, కథలు, బోధ మొదలైనవిగలిగి వారి చక్కని పటమునుగలిగియున్న గ్రంథము. రు 0 4 0

3. శ్రీరంగావధూతలవారిజీవితముఉపదేశవాక్యములు: శ్రీజ్ఞానమాంబగారిచే రచింపబడిన మృదుమధుర శైలిగల పద్యగ్రంథము, శ్రీరంగావధూతలవారి ఫోటోలతోసహా. రు 0 4 0

4. కాళీప్రసాదిని: శ్రీజ్ఞానమాంబగారు ధ్యానాభ్యాసకాలమున తనగురు స్వరూపమగు జగన్మాతకును బిడ్డయగు తనకును జరిగిన సంభాషణ. రు 0 1 0

5. శ్రీరంగావధూత పంచవింశతిస్తోత్రము.(జ్ఞానమాంబాప్రణీతము.)
వెల 0 0 6

6. యజ్ఞము (పశువధాప్రహసనము) ఈచిన్న పుస్తకముచే యజ్ఞముయొక్కముఖ్యోద్దేశమును పశువధ వేదబాహ్యమనియు నీతివిరుద్ధమనియు దెల్లంబగును. వెల 0 0 6

7. భక్తియోగము. అశ్వినికుమారదత్ ఎం. ఏ. బి. యల్ గారి ప్రణీతము ఆంధ్రీకరించబడినది. 0 12 0

7. కుమారసుగుణబోధిని: నిపురుచే గప్పబడిన నిప్పువలెనుండినాత్మాభివృద్ధి గాంచుచున్న నొకవైశ్య నారీరత్నముచే రచియింపంబడిన తల్లి కొమరునకుచేయు సద్బోధారూపక పద్యములు. 0 1 0

8, మణిరత్నమాల ఇందు శ్రీ శంకరాచార్యోక్త శ్లోకములును వాటికి సరియైన పద్యములును, టీకా తాత్పర్యమును, ఇంగ్లీషు తర్జుమాయును గలదు.
వెల 0 2 0

9. పరసాధనిపతము: 0 0 6

10. అహింస. 0 2 0

11. జ్ఞానామృతము: నిత్యప్రవర్తనకు అద్దమువంటి చిన్నపొత్తముఇందు భక్తిజ్ఞాన వైరాగ్యములను పురిగొల్పు వాక్యరత్నములును, ధ్యానశ్లోకములును దుర్గుణ విసర్జనకు తగునుపాయములును గలవు. 0 0 6

ఈగ్రంథములు దళసరికాగితములపై చక్కగా నచ్చొత్తింపబడినవి. సర్వజనోపయోగముకై స్వల్పధరలకు విక్రయింపబడుచున్నవి.

ఈపుస్తకములు కావలయువారు ఆత్మూరి జగన్మోహనరావుగారు మచిలీబందరు, కృష్ణాజిల్లా. వీరిపేరవ్రాసి తెప్పించుకొనవలయును.